ముద్రిత కాపీలు 500.

శ్రీరామానుజ విలాస ముద్రాక్షరశాలయందు,

ముద్రితము.

విజయనగరం.

1924.

 వెల 0-3-0

శ్రీ

# స్త్రీ సాహసము

పబ్లిషర్సు,

ఆర్. సంజీవిరావ్ అండ్

బుక్కు-సెల్లర్సు అండ్ స్టేషనర్సు,

విజయనగరం.



మూడవ కూర్పు 500.

శ్రీరామానుజ విలాస ముద్రాక్షరశాలయందు,

ముద్రితము.

విజయనగరం.

1924.



వెల 0-8-0



# ఈనాటకమునందు వచ్చు పాత్రలు.



పురుషులు.

వత్సరాజు—సత్యపురాధీశ్వరుడు.—(కథానాయకుడు.)

గోపాలవర్మ—విజయధామ పురాధిపతి.

విశారదుడు—గోపాలవర్మ పుత్రుడు.

ధీమణి—మంత్రి.

సుబుద్ధి—ధీమణి పుత్రుడు.

కమలాప్తుడు—(సుశీల పురుషాకారంబున గోపాలవర్మసభకు వచ్చి నప్పుడు ధరించిన నామము)

ధనపాలుడు—సుశీలను వంచించి తనగృహంబునకుఁ దీసికొనిపోయిన

రామన్న
భీమన్న } —కిరాతులు.

స్త్రీలు.

సుశీల—కథానాయిక.

భారతి
చారుమతి
ప్రియంవద } —చెలికత్తెలు.



శ్రీ

# శ్రీ సాహసము.



## ప్రథమాంకము.

(ఉద్యానవనము:— సుశీల వత్సరాజు రూపపటంబు హస్తంబు నందుంచుకొని ప్రవేశించుచున్నది.)

సుశీల— నిన్నటిదినంబున పూర్ణిమయైయుండియు క్షపాకరుండెందు చేతనోగాని ప్రకాశింపలేదు. (ఆలోచించి) సరే తెలిసినది. (పటంబునుజూచి)

మ॥ సరసాలోకన హాసభాసురవిలాసస్ఫూర్తి దీపించు సుం
దరమూర్తిని మొగంబుజూచి శశిచిత్తంబందు శంకించి నా
వరసౌందర్యమికేలయంచును గర్వ భావించి మేఘంబుదూ
రెరపిన్; వత్సధరాధినాయకుని గీర్తింపంగ శక్యంబొకో॥

ఆహా! ఏమి యీతని సౌందర్యము!

మ॥ మొగమా వెన్నెలగుత్తినిందెగడెడుం బోల్పంగ వాల్గన్నులున్
నగుపద్మంబుల సౌరు కుంతలములెన్నంబోలు నీలంబులన్
సొగసౌ బాహులతీరు గేరునవురా శుండాల తుండంబులీ
సుగుణుల్ వర్ణనజేయ శక్యమగునే జూడంగ నిద్ధాత్రిలోన్॥

ఇదిగదా సౌభాగ్యము.

ఉ॥ భూతలనాథ మౌళిమణి పూజితపాద సరోరుహుండు వి
ఖ్యాత గుణాకరుండు త్రిజగన్నుతవీరుఁడు శౌర్యశాలి సం
పూతచరిత్రుఁ డార్యజనభూషణుఁ డింద్ర సమానభోగుఁడే
నీతని బెండ్లియాడమది నెంచుట నాదగు పూర్వపుణ్యమే॥

ఈవత్సరాజు నాతండ్రికి శత్రుఁడనుమాట నెఱుంగకనే నీత

నీఁగోరితి. అందుకు మాతండ్రి దండతాడిత మహోహారగంబుకరణి మండిపడుచు వత్సరాజును రాజ్యభ్రష్టుని జేసెదనని నుడివె. (ఇంచుకయూరకుండి) అక్కటా! నాపైనింత కినియుటకు నేనేమి నే రముచేసితినోకదా! ఎంత విచారించిచూచినను నావల్ల నేరంబేమియు గానుపించదు. (ఆలోచించి) ఔను, నేనేదో చెడునక్షత్రంబునజన్మిం చితినసియు, నందుచేత నన్ను బెండ్లాడు ధరణీధవుండు రాజ్యభ్రష్టు డై యడవులఁ గడునిడుమలఁబడి క్రిమ్మర రాజ్యసుఖంబుల నందున నియు వింటినిగదా. ఇదియే వారికిఁ గోపకారణమైయుండును. వత్స రాజు నాతండ్రికి శాత్రవుండైనను, నాకుభర్తకాఁగానే యల్లునియం డుచూపు మర్యాదకునయినను వానిఁతో బగసాధింపకుండనుండఁడా. ఏమైననుసరే. నామంనబా వత్సరాజునందేచిక్కినది. నందనందన పా దారవింద మకరందరస పానమత్తేందింది రాయమాణ సన్మాననసగు నాకేమిభయము.

భారతి—(ప్రవేశించి) చెలీ! సుశీలా! సత్యపురాధీశ్వరుండగు వత్స రాజును బరిణయ మాడుదునను గర్వంబుచేతనా నన్ను బిలు వకుండ వనవిహారంబున కొంటరిగ వచ్చితివి.

సుశీ—చెలీ! కినియకుము.

భార. తే॥గీ॥ వత్సధరణీశ్వరుఁడు నీకుభర్తయగుట
నీదు పూర్వపుణ్యముసుమ్ము నిక్కముగను
నతనిబోలు భూపాలుడీ యవనిలేఁడు
జూడ నెందైనను సుశీల సుగుణలోల॥

కాని యితని నల్లునిగాఁ జేకొనుటకు నీతండ్రికి మిక్కిలి కోపముగా ను న్నట్టు చారుమతివలన వింటిని.

సుశీ—అవును, నిజముగాఁ గోపముగనే యున్నాడుః ఆకోపముతో నే వత్సరాజునకు వివాహపత్రికం బంపె.

భార—సఖి! ఆయనకేల కోపముఁ దెప్పించితివి? పోనిమ్ము వేరొక్క వరుని గోరకపోతివా?

సుశీ—మనంబున జిక్కినవరుని విడిచి వేరొకనిని జేపట్టుట పతివ్రతల

కు లక్షణంబుగాదు. (భారతి దిక్కై-) నీహస్తంబులోనున్న
వవియేమి?

భార—ఇవి మన్నరాజుగారివద్దకు వచ్చిన రాజకుమారుల పటంబులు.
వీనినిజూచుటకై నీమందిరంబున నుండగాఁ దీసికొనివచ్చితిని.

సుశీ—ఇవియా! వీటినన్నిటిని తండ్రిగారు నావద్దకుఁ బంపియిందు నీ
యిచ్ఛవచ్చినవానిని బెండ్లియాడుమని చెప్పిరి. వీటినన్నిటినిఁ
జూచి చిత్రపటంబునఁజూచిన రూపమే తెలియునుగాని సుగు
ణసంపదలు తెలియవని చింతించి యెట్టకేలకు ధైర్యంబవలంబిం
చి యీవత్సరాజును బెండ్లియాడుదునని చెప్పితి. వత్సరాజు
తండ్రిగారికి శత్రువనిగాని యీతఁడే వత్సరాజనిగాని నాకు
మొదటఁ దెలియలేదు తరువాతఁ దండ్రిగారివలనఁ దెలిసిన
ది. (ఇంచుక యూరకుండి) సఖి! వత్సరాజు కడుమాన్యుండ
ని విందు. నిజంబేనా?

భార—సందేహామేమి.

ఉ॥ నిండుమనంబు సూనృతము నీతియుధర్మముగల్గి కీర్తివం
తుండయి పుణ్యకార్యములతోఁ దులఁదూగుచుధీరుడై నభూ
మండలనాయకుల్ మిగుల భక్తినిగొల్వఁగరాజ్యమేలునా
చండహిమాంశుతేజుఁడు లసచ్చరితుండగు వత్సరాజిలన్॥

ఉ॥ ధర్మ మధర్మముల్ దెలిసి ధారుణినెల్ల ప్రజల్ స్వకీయ
సత్కర్మములన్ మనంబులనుగన్గొని సౌఖ్యముఁ జెందునట్లుదా
నర్మిలి రాజ్యమేలు ననయంబును నీశ్వర పాదభక్తిచే
నిర్మల మానసుండు ధరణీపతిరత్నము వత్సరాజిలన్

కం॥ ముదుపదుఁ పరద్రవ్యంబును
విడువఁడు రక్షింపుమంచు వేఁడిన వీరున్
నడువఁడు గురునానతివిడి
పలుకవలుకు లేఁకేలచెప్పవలెను సుశీలా॥

తే॥గీ॥ ఆడితప్పఁ బొంకుఁగ దించుకైనఁగాని
॥సత్యమేవ జయతి॥ యనుసతణి యుతని

యొద్దనేగాని మఱెవరియొద్ద లేదు
నొక్క చెప్పెదు నీమాట నిక్కముగను॥

సుశీ—(తనలో) నాపూర్వపుణ్యంబునంగాదే యీతనిని నేఁగోరుట!

భార—చెలీ! లోకంబునందు సామాన్యముగా

మ॥ ధనమూకానఁగరాదుగల్గినను విద్యాచూడగాసున్న, యీ
ధనవిద్యల్ గలుగన్ భుజాబలమ జుద్ధంబౌను వీక్షింపఁగా
ధనవిద్యాబలమున్న సుందరత తథ్యంబొప్పల్గా నుండదా
ధనవిద్యాబలరూపముల్ గలుగుభర్తన్గాంచ సామాన్యమే॥

ఈవత్సరాజునకో!

మ॥ ధనమాయుండెను రూపమౌకల్గె విద్యాచూడగా మెండుయీ
ఘనబాహాబల శౌర్యమా గలిగె సత్కళ్యాణ చారిత్రుడీ
తనితోఁబోలగఁలేరు చెప్పితిని తథ్యంబొప్పఁగా భూమినే
జనపాలాగ్రణులైననున్ సుగుణసంజాతా సుశీలాగనన్॥

సుశీ—సఖి! నీవాతనిసంగతిఁ జెప్పుచుండగా వత్సరాజే నాముందున్న
ట్లే యున్నది. (పటంబునుజూచి)

ఉ॥ ఈనవమోహనాంగుని మహీధవచంద్రుని బూర్ణచంద్రబిం
బానను జిత్తచోరుని మహాగుణవంతుని వత్సరాజునిన్
మానక పెండ్లియాడెడి సమంచిత భాగ్యమిఁకెన్నడబ్బునో
మానసమందునీవిపుడు మానినిచూచి వచింపు మింపుగన్॥

భార—సఖి! యీలీల బేలవై నన్నడిగెదవేల? వివాహప్రయత్నములు
జరుగుచుండెను. వత్సభూపతికి వివాహపత్రిక పంపబడెను.

సుశీల. మ॥ జనకుండంపిన పత్రికంగని మహాసంతోషమేపారగా
నను బెండ్లాడగ వచ్చునో తలపగన్ శత్రుత్వమాధీశుడీ
తని పుత్రీమణిఁ బెండ్లియాడనని చిత్తంబందు శంకించునో
మనమందేమియుదోచదయ్యె చెలియామద్భాగ్యమెట్లున్నదో

(తనలో వత్సరాజు నుద్దేశించి) ఓవత్సధరాధినాథా! నాతండ్రికి
శాత్రవుండవని నైనను దలంపక నిన్నేకోరితి.

మ॥ నినువాంఛించితి నీదురూపమునె హృన్నీరేజమందుంచితిన్
వినుతిన్ జేయుచునుంటి నీగుణములే విఖ్యాతిగం బొందఁగన్
ఘనకారుణ్య కటాక్ష వీక్షణసుధా కల్లోల పాథోధివై
ననుగైకొమ్ము మనంబులో దలపకన్ శత్రుత్వముల్ భూవరా।

(దైవము నుద్దేశించి) ముకుందా! ఆవత్స భూపాలుడు నాజనకుడు పంపిన వివాహపత్రిక గనగానేనన్ను బెండ్లాడ సమ్మతింపుజేయు భారము నీ భుజస్కంధమునందు బెట్టితిని. దాసురాల నెట్లుచేసి నను సరే.

భార — చెలీ! యెంతసేపిచ్చట నుండుట. ఈంచుకసేపావైపునకు బోయి విహరింతుము రమ్ము. (నడచుచున్నారు)

భార — సఖి! సుశీలా! విరహిణీజనంబుల వేపుటకై మేనల్లుండగు మన్మథునకు సాహాయ్యం బొసర్ప జంద్రుడు వెన్నెల గాయుచుండెనా యనునట్లు నెల్లెడ నల్లిబిల్లిగ నల్లుకొన్న మల్లెపందిరులక్రింద బడిన మల్లెమొగ్గలును, ఘుమ్ముఘుమ్మని కమ్మని తెమ్మెరల నొసంగు జాజి పుష్పంబులును, కందర్పుని హస్తంబున నుండెడు బాకులో యనందగు కేతకీ పుష్పములును, డెందంబుల కానందంబు గల్పించు మందార సుమబృందంబును, సువాసనచే మిగుల నెగడు పొగడ పూవులు, మాధవపదారవింద పూజార్హంబులగు మాధవీ చయంబును, యుల్లంబుల కుల్లాసంబును వెల్లిగొలువ నెల్లెడ నల్లుకొన్న మల్లికాది వల్లికలనుండి రాలిన పూవుమొత్తంబులును, కుసుమ సౌరభ్యంబున నన్నిటమించిన సంపంగిపూవులును, హృదయాహ్లాద కరంబులగు విరిజాజులును, పూవిలుకాడు తనశరీరములను వదునుపెట్టెడి నునువైన పలకరాళ్ళో యనంబరగు కదళీతరువులనుండు లేతయాకులును, చిలుకముక్కులచే నొక్కబడి కెంపు రుచులీనెడి దాడిమీ ఫలంబులును, మార్గాయాస సంజనిత తృష్ణావిదారణ కారణంబగు నారికేళఫలంబులును, భూర్జ కర్జూర పనసాది ఫలవృక్ష రాజంబులును, విమలసలిలాసారంబులగు కాసారంబులును, తత్కాసారంబుచెంత దొంగజపంబాచరించుచు మీనంబులబట్టుటకై వేచియుండు బకంబులును, మునుగుచు లేచుచు

జలక్రీడలనాడు రాజహంసలును, లేమావిచిగురుల మెక్కి మత్తిక్కి గోకోయనిమారావంబులు సేయుపికంబులును, ముద్దుపలుకుల శ్రీరామ రామయని పిలెచెడు శుకంబులును, గలిగి డెందంబున కానందంబుగల్పించు నీయుద్యానవనమెంత, రమణీయముగనున్నదో చూడుము.

సుశీ—భారతీ! ఇటుచూడుము

తే॥ గీ॥ పూలనుండెడి మధువులను గ్రోలికంటె
భ్రమర దంపతులవిగో హావాయిబోలె
జుమ్ము జుమ్మనియెడు ధ్వనుల్ జిమ్ముచెగురు
చుండెఁజూడంగ మిక్కిలి చోద్యముగను॥

భార—అవియట్లువరుగెత్తుట మధురరసంబునుగ్రోలిన సంతోషంబుచే గాదు. నీకురులతో సాటిగాలేమని పరుగిడుచున్నవి.

సుశీ—చెలీ? నీ వేళాకోళమున కేమిగాని యీసంపంగిపూవులను కోసికొందమురమ్మా. (సంపంగి పూవులగోసి) ఆహాయేమిదీనిసౌరభ్యము.

ఉ॥ వాడుకొలంది దీనికిసువాసనహెచ్చగుచుండు దీనికిఁ
జోడగుపూవులేదెచట జూడగవాసన యందువహ్వారే

భార—వేడుకదీరనీకిదిగో వేడ్కను సంపగిపూవునిప్పుడూ
బోడిరోనీశిరమ్మునను బొందుగఁబెట్టెదచూడుమాసఖీ॥

సుశీలజడయందు సంపంగి పూవునుముడుచుచున్నది).

భార—(ప్రవేశించి) సుశీలా! నేటిదినంబున వచ్చినవార్తాపత్రికయిదిగో. (వార్తాపత్రికనొసంగి వెళ్లుచున్నది)

సుశీ—(వార్తాపత్రికచదివి) సఖీ! వింటివా? కన్యలవివాహంబునుగూర్చియొక్క మహాపురుషుడెట్లు వ్యాసమునువ్రాసినాడో! ఆహాయెంతచక్కగనున్నది. ఎంతజనసమ్మతంబుగనున్నది

భార—ఏమనివ్రాసినాడు.

సుశీ—వినుము. ‹‹మనభరతఖండంబునందు స్త్రీలకు వివాహంబులొన

ర్పుట యందు తల్లిదండ్రులు మిక్కిలి పొరబడుచున్నారు. పిల్లలకారవయేటనో లేక యేడవయేటనో తల్లిదండ్రుల కిష్టమువచ్చిన వానిని దెచ్చి కట్టబెట్టుట, తల్లిదండ్రులు ధనంబునకాసపడి యేకురూపికైనను సుకుమార శరీరులగు తమసుతల నొసంగిగాసిజేయుట మొదలుగాగల యనేక దురాచారంబులు మనలోనున్నవి. ఇవియన్నియు తమపిల్లల కెట్టియనర్థకంబులో తలచి చూడుడు. పిల్లలయెడ జాలినేదలపరు? ఇదిమీామదికి ఖుణ్యదాయకంబని తోచెనా సోదరులారా! నావచనంబులు మీాహృదయంబులకుఁ గష్టముగా నోఁచినదోచుగాక. శాస్త్రజ్ఞులారా! నేజెప్పెడిసంగతియందు శాస్త్రవిరుద్ధంబేమియు గానుపించదు. నాయందుగరుణబూని నావచనంబు లాలింపుడు. మీా యాడుపిల్లలను వృద్ధిలోనికి దెచ్చు మార్గంబును విలోకింపుడు. మొదట మీాపిల్లలను విద్యావతులుగా జేయుడు. దీనివలనవారికెట్టి సుగుణంబులలవడునో విచారించిచూడుడు. స్త్రీలకువిద్య సేమమనినక్కాణించు తుచ్ఛుల వాక్యంబులు చెవిలోజొరనీకుడు. తరువాత వారికి యుక్తవయస్సు రాగానేయన్యోన్యానురాగంబుగల వరునిదెచ్చి వివాహంబు సల్పుడు. ఇది సర్వజన సమ్మతంబైయొప్పు.

భార—ఇట్లు జరుపుట యెంతయు మంచిదిసుమీా.

(తెరలో జాంఘికుడు డిండమువాద్యంబుతో)

ఓహో! పురజనులారా! నేను చెప్పలేదనేరు. వినలేదనేరు గట్టిగ చెప్పుచున్నాను. వినండి. మన చక్రవర్తిగారి కూతురు [illegible] మ్మగారిని సత్యపురరాజు గారగు వత్సరాజుగారికిచ్చి వి[illegible] వాహము చేస్తారు కాబట్టి మీాగృహంబులెల్ల జక్కగా[illegible] పురంబెల్ల శృంగారింపుడు.

భార—వింటివిగదా! వత్సరాజుకడనుండి శుభపత్రిక వచ్చెనుగాబోలు

సుశీ—(తనలో) ఇప్పటికి నాహృదయంబు చల్లబడివది.

భార—చెలీ! అటుచూడుము.

తే॥ గీ॥ ఆలమందలుగృహముల కరుగుచుండె
పిట్టలన్నియు దమతమ పట్టుజేరె
జారచోరులెల్లరు మదిసంతసింప
నస్తగిరి జేరుచుండెను నదిగొ యినుడు॥

కావున గృహంబునకుబోదము రమ్ము

(ఇరువురును నిష్క్రమించుచున్నారు.)

(ప్రథమాంకము. సంపూర్ణము.)





శ్రీ

# స్త్రీ సాహసము.

## ద్వితీయాంకము.

(సత్యపురము! సుశీలసౌధము. సుశీల. ప్రియంవద.)

సుశీ—సఖీ! ప్రియంవదా! ప్రపంచంబున కాంతకుఁ గాంతునికంటె నితర దైవంబులేదు. చూడుము.

సీ॥ సకలసౌభాగ్య కా ♦ సారమునకురాజ
హంస దలంపఁగా ♦ నాత్మధవుఁడు
అంచితానంద సౌ ♦ ఖ్యాంబుధి నోలాడఁ
బతిగదా పూర్ణాక్షి ♦ పాకరుండు
సంతాపదావాగ్ని ♦ శాంతింప నిజభర్త
యేకదా ఘనవృష్టి ♦ జోకవాఁడు
సంసారమనుమహా ♦ సాగరమ్మునఁదేల్చు
నౌకకువరుఁడెకా ♦ నావికుండు

తే.గీ॥ సకలమంగళములుగూర్ప ♦ జాలువాఁడు
దలపఁగా ప్రాణనాథుఁడే ♦ తరుణికెపుడు
యింతవచియింపఁగానేటి ♦ కెంచిచూడ
తోయజాక్షికి భర్తయే ♦ తోడునీడ॥

సీ॥ ధరలేనిదుఃఖాబ్ధి ♦ తరియింపఁజేయఁగా
భర్తసేవగద జా ♦ పట్టునావ
స్వర్గపురాంతర ♦ సౌధరాజము నెక్క
రమణుసేవయొగదా ♦ రాచబాట
సహధర్మచారిణీ ♦ సద్వ్రతమ్మునకెన్నఁ
నాత్మనాథునిసేవ ♦ యాలవాల
మతిపావనముదయా ♦ రణ్యము శెక్కంగ
కోమలాంగునిసేవ ♦ కులిశధార

తే॥ గీ॥ సకలకార్యనిర్వాహక ♦ సాధనంబు
ప్రాణకాంతుని నిజపాద ♦ పద్మసేవ
అంచితానందమునుగూర్చు ♦ నతివ కెపుడు
ప్రాణకాంతుని నిజపాద ♦ పద్మసేవ॥

ఇది యట్లుండనిమ్ము

చం॥ పతిహితవృత్తి నెప్డు నెడబాయక కోరికతోడ సజ్జన
స్తుతహరి గాథలార్యులు బుధుల్ వినిపింపగ వించు మోదము
ప్రతిలంగ వారికింగను సపర్యలు సేయుచు కీర్తినొందు నా
సతి సతి పతివ్రతామణిగ సజ్జనులెంతురు ధారుణీస్థలిన్॥

పతివ్రత యెప్పుడును,

తే॥ గీ॥ ఉన్నదానికి సంతృప్తి నొందుచుండు
నెల్లపూజలు సేయుచు నెగడుచుండు
సకల సాధ్వీజనైక హృద్ధ్యానవద్య
సుగుణ గణనీయుయగుచుండు జగతియందు॥

తే॥ గీ॥ అత్తమామలయందున బత్తిగలిగి
మఱదులయెడ సంతతము సత్కారుణంజూపి
భృత్యజనముల నెపుడు కోపింపబోక
నుభయకులములకు సుకీర్తి యువిదదెచ్చు॥

క॥ పరపురుషులు సోదరులుగ
పరద్రవ్యంబులు తృణముగ బరికించి మనో
హరుసేవించుచు నుండును
ధరణిని సద్గుణవధూటి తలిరుంబోడీ॥

తే॥ గీ॥ రమ్యగుణములచేతను రమణికెప్డు
ప్రాణనాయక పదపద్మ భజనశీల
ప్రాణహానికైన నోర్చు గానిమాన
హానిసైపంగ జాలదో యతివవింటె॥

శైఘ్రేల,

క॥ పతియే దైవము గురుఁడుఁ
పతియే సకలంబుసుమ్ము పడతికి నెపుడుఁ
పతిసేవఁ జేయ నెంచని
సతిబ్రతుకు బ్రతుకె దలంప క్ష్మాతలమందుఁ॥

ఒకత్రుటికాలంబైనను పతినెడబాయక పతిమెప్పు బొందుచుండి నను దానును నాతనితో బాములు పడుచుంటి యున్నను అవియెల్ల సుఖంబులుగనే భావింపుచు సుగుణసంశీలములుగలిగి శోభిల్లుచుండును.

ప్రియం—చెలీ! నాయందు గరుణచే శ్రమముగాని నీవు వచించినట్టి నీతిదాయకంబులగు వాక్యంబులాలించి నేనపారసంతోషపారావారాంతర్నిమగ్నమానసనైతి.

సుశీ—మఱియుఁ పతివ్రతలకు స్వబలంబుకంటె దైవబలంబెక్కుడుగ నుండును,

ప్రియం—సఖీ! నీవుచెప్పినమాట నిజమే.

సుశీ—(ఆలోచించుచున్నది.)

ప్రియం—అనుఁగుసఖీ! నీవేదియో యాలోచించుచున్నట్లున్నావే?

సుశీ—యేమున్నది!

మ॥ నను నెన్నండును బాసియుండఁడుగదా నాథుండు నేఁడేలకో
యినుఁడస్తాద్రిఁ జేరుచుండినను దా నింటాఁకరాదయ్యె నే
మనపౌరుల్ తమసంగతుల్ దెలుపఁగా క్ష్మాధీశుదర్శింపఁగా
జనుదేరఁ వినుచుండెనో యికటమ ధ్వాంతంబునఁ దోచదే॥

అట్లుగాక,

తే॥ గీ॥ శాత్రవుండెవ్వఁడైన రాష్ట్రంబుపైని
దండివిడియుటచేత బ్రచండబండ
నంబొనర్చుటకై హృదయంబునందు
దలఁపుఁబూనుచునుండెనో తలఁపఁగాను॥

ప్రియం—తరుణీ! పురజనులు తమకష్టసుఖంబుల దెలుప్పఁగోరుట

జనుఁడెంచుటచే నాలస్యం బై యుండవచ్చు. అంతియే కాని,

మ॥ అరిరాట్కాననవీతిహోత్రుఁడు సముద్యద్భూరితేజుండు
శ్రీ తరుణీనాథ పదారవిందయుగళ ధ్యానైకశీలుండు, స
త్కరుణాపాలుఁడు వత్సభూపతి నిసంగ్రామంబులోఁ దాఁకఁ
గాఁ దరమే యన్యధరాధినాయకునకుం దథ్యంబుగాఁ జూడఁగన్॥

తే॥ గీ॥ అఖిలరాజన్యమౌళి రత్నాంశుదీప
రాజనీరాజతాంఘ్రి విభ్రాజమాను
డతని నామంబు వినఁగనే యవనిపతులు
జడియుచుందురు సతతంబు సరసిజాక్షి॥

సుశీ—ప్రియంవదా! యెందుచేతనోగాని చిత్తంబంతయు కలవరపడుచున్నది. కుడికన్నును కుడిభుజంబును నదరుచున్నవి. ఏమియశుభంబు వాటిల్లునో తెలియకుండె. ముకుందపదారవిందమకరంద రసపాన మధుకరులమగు మాకుగాని రాష్ట్రజనులకుగాని యేకీడును రాకుండుగాక.

ప్రియం—అరుగో రాజుగారు వచ్చుచున్నారు.

సుశీ—(భర్తకైజూచి ప్రియంవద నుద్దేశించి) ప్రియంవదా నాథుని ముఖంబు వీక్షింపుము.

మ॥ వనితా! పున్నమచంద్రుఁబోలు ముఖబింబంతయున్ వాడి
యాఘనగర్భాంతరచంద్రబింబముగతిన్ గప్పెట్టెగన్నీళులున్
జనుచుండెన్ గద కాల్వలై యిపుడహో జాలిన్బడన్ గారణం
బును నూహింపఁగఁ గాన రాదుగదవే పూబోఁడి వీక్షింపఁగన్॥

ప్రియం—(తనలో) అరుగో రాజుగారు వచ్చుచున్నారు. ఇఁక నే నిచ్చట నుండరాదు. (నిష్క్రమించుచున్నది)

వత్స—(ప్రవేశించి) తనలో హా దైవమా!

ఉ॥ ఏమని చెప్పువాఁడ నిఁక డీగలి నన్ను జయధ్వజుండు నా
భూమితలంబు వీడి వన భూమికిఁ బొమ్మని నాఁడటంచు నా

కామిని దీనినిట్లు వినఁగఁ గాంచ దెదుఃఖము నాత్మలోన నా హా మహిలోన జేకురెను నద్భుతకష్టము నాకు దైవమా

చింతించుట వెఱ్ఱితనము. ముందుగా నారమణీమణి చిత్తంబు నుంగొని పిదప యీవార్త దెలిపెద. (సుశీలదగ్గర కేగుచున్నాడు.)

సుశీ—(లేచినిలుచుండి)

తే॥ గీ॥ ముద్దులను మూటగట్టుమీ మోమునేఁడు
వాడియుండెను నిసియందుఁ బద్మమట్లు
కారణము జెప్పనందాళిఁ గడుపులోన
జేయిపెట్టి కలఁచినట్లు లాయెనిపుడు॥

ప్రతిదినంబును నున్న సంతోషంబు గానరాదు. చింతాక్రాంతు లై యున్నట్లుదోచెడి. ఈసేవకురాలు దానికిఁ గతంబెఱుంగదగునేని మన్నించి వినుపింపగోరెద.

వత్స—తరుణీ! సకలసౌఖ్యంబులకును నాకరంబగు నీవు నాకు సతివై యుండుటచే నాకుఁ జింత యేలకగును? కానినీమనంబు దెలియనొ క్కసంగతి నడుగదలచితిని. అందువిశేషమేమియులేదు గాని, నే నొకవేళ రాజ్యభ్రష్టుండనై వనవాసంబు సల్పనైనచో నీవేమిచే తువాయని నామనంబున బెంగపడినది.

సుశీ—చంచలి కేద వేలనీవిటులు వ్యాకులతన్ మదిఁబూని; యేరి కిందలఁపవుకీడు సేయఁగను ధారుణియందుననట్టినీవు బా ములఁబడుటెట్లు నిక్కమిది బొందిననీ వెనువెంటవత్తునిన్ విడిచి మనంగనోపుదునె వీరచరిత్రమనోధవా భువిన్॥

మీకట్టియిక్కట్టు లెప్పుడును సంభవించవు. ఒకవేళ దైవము మనయందు గరుణబూనక యిక్కట్టులకు బాలుచేసెనేని నేనునుమి మ్మునగూడి చనుదెంతు. మిమ్ము విడినాడి నిమిషకాలంబైనను జీవింప గలనా! పతినిబాసిచరించుకాంతబ్రతుకు సజ్జనులచే శ్లాఘింపబడనిది.

వత్స—(తనలో) ఆహా! యిట్టివిగదా పతివ్రతాగుణంబులు.

"పతిహితవృత్తి నెప్పుడెడ బాయుక యుండెడినాతినే బతి
వ్రతగగణింతురి సజ్జనులు భావమునందున సంతసంబునన్
పతిహితవృత్తినెప్పుడెడఁ బాసిచరించెదు కాంతమృత్యుదేవ
వతగగణింతురి పజ్జనులు భావమునందున సంతతంబునున్॥

(ప్రకాశముగా) సద్గుణజాలా! సుశీలా! నీవట్లుపలుకుటచే స్వాంతంబునంగలుగు చింతపోయి సంతసంబుదయించె. నాకుగల్గిన చింతకుఁ గారణంబేమనిన నేఁడు బేరోలగంబున మంత్రిసమేతుండనై గొలువు దీర్చియున్నప్పుడు శ్రీనికేతనపురాధీశ్వరుండగు భవజ్జనకుండు కొంత సైన్యమును నాపురంబును ముట్టడివేయబంపి ముట్టడివేయుకపూర్వమే చారునితో,

మ॥ కరమర్థిం గరణమాచరించెదవొగాకన్ జాయతోఁగూడిదః
ష్కరమైనట్టి యరణ్యావాసమునొగిన్ సల్పంగనీవేగదో
నరనాథాగ్రణిరెండు బ్రిశ్నలకిటన్ బ్రత్యుత్తరంబిమ్మటం
చురహిన్ వార్తనుబంపెవింటివిగదా చోద్యంబువీక్షింపగన్॥

సుశీ—(తనలో జనకుద్దేశించి) జనకా! యల్లునకిచ్చుకట్నంబా యిట్టివార్తబంపుట? అల్లుడనియైనను దలంచి శత్రుత్వంబు మరువరాదా! ఇట్టిపని జేయుట నీబోటిసుగుణాఢ్యులకు న్యాయంబా? వత్సరాజుకు బెండ్లిగాకపూర్వమే యల్లుండనియైనను దలంపక నతనిరాజ్యంబుచూరగొందునని చెప్పితివి. (ప్రకాశముగాభర్తనుద్దేశించి) నాథా! అందులకు మీరేమి ప్రత్యుత్తరంబొసంగితిరి?

వత్స—తరుణీ! నిన్నుదలంచియైనను నతడుశత్రుత్వంబు మఱవక నీతిమాలి వర్తించెనుగాని నేనట్లు వర్తింతునా? ఆతడాచరించినట్లే నేను ఖడ్గంబునుబూని సమరంబునకు దలపడితినేని మామతో కయ్యంబాచరించువాడని సుజనులు నన్ను హేయంబుగజూడరా? అందుకై నేను సమరంబాచరింపననియు, భార్యాసహితుండనై గహనావాసంబుసల్ప నేగుదుననియు చారునితోఁజెప్పిపంపితి. కావున మఱియీరాత్రియే కాననంబున కేగవలయు. అక్కటక్కటా! రమణీమణీ! నన్నుబెండ్లాడి సకలసౌభాగ్య సంపద్వార్ధినోలాడుదువని దల్లంచితిగాని యిట్టి యిక్కట్టుల పాలగుదువని తలంపనై

తివిగదా! నన్నేల పెండ్లాడితివి? నీజనకుండు నాకు శాత్రవుండని యైనను దలంపక నన్ను వరించితివి. సకలభూపాలురును నిన్ను వాంఛించి తమతమ రూపపటంబులు నీజనకునికడకు బంపుచుండ, శాత్రవుండనితలంచి యూరకుండక నేనును నారూపపటంబేలపంపితి? పంపితి బోనిమ్ము. వాటింగాంచి నీజనకునకిష్టమైన రాజుందెచ్చి పరిణయంబు సల్పక నీయిచ్చవచ్చినవానినే గోరుకొనమని చెప్ప నేల? చెప్పెనుబోనిమ్ము. వాటిగాంచి నన్నుమించిన సుందరాకారులగు రాజకుమారు లెందరో యుండగా నన్నేయేలవరించితివి? అయ్యయ్యో. నిష్కారణంబుగ నెట్టిబాధలకు పాలుపడితివి. నన్ను వివాహమాడకుండినచో నీకీపాట్లురాకుండునుగదా.

సుశీ — నాథా! నేనట్లుదలంచుట లేదుగాని నన్నుబెండ్లాడుటచేతనే మీకీకష్టంబులొనగూడెనని చింతించుచుంటి. నన్నుగూర్చి మీకావంతయు డెందంబున సందియంబువలదు. నేనుమీతోపాటు కష్టసుఖంబులందవలసినదాననేగాని మిమ్ము విడచియుండుదానకుగాను. కష్టంబులగూర్చి మీరుచింతింపవలదు.

తే॥ గీ॥ కష్టమెప్పుడనుభవింప గలిగినాడు
యపుడె సకలసుఖంబుల నందనోను
మున్ను రాముడరణ్యభూముల జరించి
కష్టముల్పడి సుఖములు గాంచలేదె॥

తే॥ గీ॥ దైవగతి యట్టులుండునో ధరణియందు
నట్టిరీతిని దప్పక యగుచునుండు
నద్దిగడవంగా నెవ్వారికైననుగాని
తరముకాదు చింతింపకు తరుణియింక॥

వత్స — యోహోపారత్నమా! నీవునాయందనుండ నాకేవిధమయినచింతయులేదు. ఆభారతీనేతయడవులగడునిడుమలబడుమని ఫాలతలమున వ్రాసినాడు. అంతయునునానందవనందనుండేమనకు సహాయభూతుండగుగాక. ఇకమనమీరేయి పురంబువిడువవలయు. కావునమనవాలవేల్పగునాముకుందునిమనసార నొక్కమారుభజించిగమనాయనంబునుగూర్చినిద్రింపుము రమ్ము. (నిద్రించుచున్నారు.)

ద్వితీయరంగము—అరణ్యము.

(వత్సరాజు— సుశీల ప్రవేశించుచున్నారు.)

సుశీ—

మ॥అడు గైనన్ నిడజాలనింకను ఘనాయాశంబుమెండయ్యెని
ప్పుడుభూపాలకసత్కులాభరణనన్ బ్రోవన్ దగుఁ సత్కృపన్

వత్స—

బలుకష్టంబులు చెందగల్గితివిగా ప్రాసాదమందేప్పుడుఁ
గడుసౌఖ్యంబుననుండునీవిపుడహా కాంతాశిరోరత్నమా॥

సఖీ! ఇప్పుడు శని మనపాలిటనున్నాడు. అక్కటా! కలిబాధ స
హింపదరంబుగాదుకదా!

సుశీ— ఆకలిబాధకంటెఁగడు నాకలిబాధయె యెక్కువయ్యెనో

వత్స—

ప్రాకట చంద్రబింబముఖ రమ్యచరిత్ర సుశీలచూడగా
జేరవయ్యెనయ్యొ సరసీరుహనేత్రి ఫలంబులెచ్చటన్

సుశీ—

నాకు బలంబుదగ్గె నరనాయక నేనడువంగజాలనే॥

వత్స—అబలా! ఈవృక్షంబునీడయందించుక విశ్రమించి యలసటదీ
ర్చుకొని పిదప నేదైనపుంతబు జేరుటకు ప్రయత్నింతము

(వృక్షంబునీడకు జేరి విశ్రమించి)

వత్స—(తనలో)ఆహా! ధాత్రధాత! అయ్యోనాదిదెంతనిర్భాగ్యపు
బ్రతుకు. సకలరాజులచే వినుతిగాంచుచు సత్యపురంబేలునట్టి నా
కీయరణ్యావాసంబున గాంతానమేతుండనై యిట్టియిక్కట్టులు ప
డవలసివచ్చెనుగదా. నాయవస్థ యిట్లుండె,

చం॥ తలదురలునరత్నజాలములు వేక్కుమగోల్వగరత్నశోధమ్ము
దలచుచు నన్నుగూడి సుఖమందుచుమంజులయుసచ్చరితోరమె
చెలఁగెడి యీమెయిప్పుడు జెలిపగనొయ్యెను గాఢనటులో
వలఘుర్ల నెట్టివారికిని ధాతలిఖించినవాలితప్పునే॥

(పరిశాళముగా) సరోజాక్షీ ! నామూలంబున నీకెట్టికష్టంబులు సంప్రాప్తమయ్యెను. అడవులందు నావెంబడినిరుగుచు గడనిడుము లు గుడుచుచుంటివిగదా! పరిచారిణులు సంశ్రితమును గొలువవైభవం బున నవరత్నఖచిత ప్రాసాదంబున మెలంగు నీవు నామూలమున ఘోర కాననమునకు రాగలిగితివిగదా! పండువెన్నెలయందుపైనను నిం చుక నడువ వెరచుచున్న నాకతంబున గాదె నేడీ వేడి యెండలో నడ చుచుంటివి. కోకిలారవంబు నాలింప ఛీటిల్లు రమణీమణీనీవు నేడీ ఘో రకాంతారంబున ఘనసింహ శార్దూలరవంబు లాలించు చుంటివి.

సుశీ—మనోవల్లభా ! నన్నుగూర్చి మీరు చింతింపవలదు. మీ యండనుండి నేననుభవించు కష్టంబులన్నియు నాకు సుఖంబులే. ఆపదవచ్చువేళనే ధైర్యంబు బూనవలయు. చూడుము!

శా॥ దారిద్ర్యాంబుధిగూలినప్పుడుమహాదరిద్ర్యంబుగోల్పోవుచో
ఘోరంబౌ విపదబ్ధిమున్గి కడుచిక్కుల్ చెందగానున్నచో
ఘోరారణ్యమునందు నెవ్వరునుదిక్కుల్ లేకయున్నప్పుడున్
ధీరత్వంబును బూనగా వలయుగాదే మానసంబందునన్॥

వత్స—మనోహారిణీ! యింకెక్కడిధైర్యము. యింకెక్కడి రాజ్య ము, ఈసర్వాభ్యుదయము గ్రీష్మరరాజ్యంబుగూడ నేలునా.

తే॥ గీ॥ పావనంబైన గంగాప్రవాహమెలమి
పుణ్యభూములయందున బొల్పుమీఱ
జాలుచుండును సతతంబు వట్టినేల
పైనబోలుచుండును సోరబాలనగునె॥

సుశీ—నాథా! చీకటి కొన్నిదినంబులను వెన్నెల కొన్నిదినంబులం ను గాయుచుండును. కల్మిలేములు కావడికుండలవంటివి. నేను మీకు జెప్పవలసినదానగాను.

వత్స—తరుణీ! అదుగో భానువంతునిపురంబు. నీవీవృక్షంబుకడ నుండుము. నేనదే సత్వరంబుగ పురములోనికిం బోయి మనకు గావలసిన యాహారంబును గొనితెచ్చెద.

సుశీ— నేనిచ్చట నొంటరిగా నుండజాల. తమవెంట నేతెంచుట కావలెను.

వత్స— రమణీ! నాకెంటవచ్చుటకేమియు యభ్యంతరము లేదు; కాని, శుద్ధాంతసౌధంబున నొరులకంటబడకుండ మెలంగిన నీవు నేడీ పురంబున సర్వజనంబులచే జూడబడనేల? అదియుంగాక మనమిరు పురమునుగలిసిపోతిమేని మనల నానవాలుపట్టగలుగుదురు నేనొంటరిగ నేగితి నేని యే రహస్యమార్గంబుల వెంబడినో సత్వరంబుగ బోయి కావలసిన యాహారంబు దెత్తు నీవిందుకు మారుబలుకక యిచ్చట నుండుము పోయివచ్చెద.

సుశీ— మీరు కడురయంబున రావలయుసుండీ.

వత్స— సంశయంబేల? (నిష్క్రమించుచున్నాడు.)

సుశీ— (తనలో దైవమును దేశించి) అకటా! దైవమా! రాజాధిరాజులెల్ల నరిగాపులై రాజ్యంబేలు నానాధుని స్వయముగా భోజనసామగ్రి దెచ్చునట్లు జేసితివా! ఆహా! నీ చర్యలెట్లు? చిత్రంబులు.

ధనపాలుడు— (ప్రవేశించి; తనలో) రాజకుమారుండు తన రమణీమణిని యిచ్చటనేగదా విడిచివచ్చితినని చెప్పినాడు. సామగ్రి యిచ్చట యుండాలన్యము జేయుమని నా సేవకుండగు రామభద్రునికి జెప్పితినిగదా. నేనిప్పుడైనను నా రాజునందను డిచ్చటికి రాకపూర్వమే ఈమెను వంచించి మద్గృహంబునకు దోడ్కొనిపోగవలెను. ఈమెను మోసపుచ్చుటకు నానవాలుగా నాతనియుత్తరీయంబును బియ్యంబు దెప్పింతునను నెపంబున గైకొని తెచ్చినాడనుగదా. అదుగో యావృక్షంబుకడ నా రమణీమణి యున్నది.

సుశీ— (తనలో) నాధుండరిగి చాలసేపయ్యెను యింతవరకును రాలేదు. ఒంటరిగనుండుటకు మనంబున మిక్కుటంబగు భీతి వొడముచున్నది.

ధన— (తనలో సుశీలను దేశించి) ఆహా? యేమి సౌందర్యము!

తే॥ గీ॥ బాలగాదిది మరుచేతి కోలగాని
కొమ్మగాదిది బంగారు బొమ్మగాని
కాంతగాదిది రత్నాల బంతిగాని
అంబుజాక్షిగాదు శశిబింబంబుగాని॥

ఇక్కురంగాక్షి చక్కదనంబెన్న నక్కలువరాయనికైనను దరంబుగాదు:

తే॥ గీ॥ చక్కదనముల నొక్కచోటక్కబెట్టి
ఈమెయందన్నియును జేర్చి యింపుతోడ
సృష్టిజేసెను గాబోలు సృష్టికర్త
గాకయున్నట్టి సొగసు గలుగనౌనె॥

అట్లుగా దేవి,

మ॥ ఘనరంభాది విలాసినీ వతులలోకంబందు సృష్టించి ఖ్యా
తిని జేపట్టి విధాతనేనను సుకీర్తింజెంద నావేర్పునన్
వనితారత్నమునొండు చేతునను చుం బంతంబుతో నీసతిన్
జనియింపంగను జేసియుండును రమాసత్పుత్రుడిద్ధాత్రిలోన్॥

ఇట్టియందచందంబులుగలమందయాన నెందునుదిలకించియుండలేదు.

తే॥ గీ॥ ముదితలావణ్య వైభవమ్ముగనులార
గాంచినంతనే శరములు కాముడిపుడు
పరుపసాగెను నాపైనగరుణలేక
క్రూరమృగమును వెన్నాడి కూల్చనెంచి
బాణములు విడిచెడి వేటకానివగిది॥

మ॥ సరసాలోకనహాసభాసురవిలాసస్ఫూర్తి దీపించు సుం
దరహాసిని మొగంబుగాంచినంతనెహరిధ్యానైకనిష్ఠాపరుల్
వరమౌనీంద్రులు దీనియొద్ద ఘనసేవల్ సేయగానెంచుట
బ్బిరమా నేదిలకించిచూడగనుదిన్ మోహాతిరేకంబునన్

పాపము! అడవులవెంబడిగడునిడుమలు గుడుచుచుమదిరుగుటచే నీ
డలు వాడియున్నది. నాయొద్ద నిలతలెక్కకు మీరినధనమున్నందు

కు విట్టి తరుణీశిరోరత్నము నాకుఁడవలసినదే. (సుశీలం జేరి ప్రకాశముగా) అబలా! భర్తరాక కెదురుచూచుచుంటివా?

సుశీ—అన్నా? నీవెవ్వరవు?

ధన—(తనలో) అన్నాయని పిలువకుండిన బాగుండునుగదా! (ప్రకాశముగా) నేఁ భానుమంతుని పురంబుననుండు ధనపాలుండను వైశ్యకుల శ్రేష్ఠుండ. నీభర్త భోజనసామగ్రిఁగొనుటకై నాకడకగుడెంచి మాయింట గొన్నిదినంబులు కాలంబుగడుపుటకై నన్నుగోరనే నందులకు సమ్మతించితి ఈయుత్తరీయంబానవాలుచూపి నిన్నుగొనివచ్చుట కెవ్వరినైనబంపుమని నీనాథుండు నన్నుగోర సేవకులెవ్వరును సమయంబునకులేకపోవుటచే జాలిదలంచి నేనేవచ్చినాఁడ. జాగుసేయకరమ్మా.

సుశీ—అన్నా! నీకెంతయు పుణ్యములభించును. ఇట్టిదీనులయెడ దయగల్గిన నిన్ను నందనందనుఁడనిశమును రక్షించుగాక. పోదము రమ్మా. (నిష్క్రమించుచున్నారు.)

ద్వితీయాంకము, సంపూర్ణము.





శ్రీ

# స్త్రీ సాహసము.

## తృతీయాంకము.

(భానుమంతుని పురంబున ధనపాలునిగృహము.)

సుశీ— (తనలో) అక్కటా! యీధనపాలుడు నన్నింత మోసపుచ్చె ను. నాథుండు నన్నారయుటకెంత కష్టపడుచున్నాడో కదా! నా వర్తమానంబాయనకు చెప్పువారెవరు? [దైవమునుద్దేశించి] అ య్యో దైవమా! అంతటిమహారాజుగర్భంబున నుదయించి వత్స రాజునకు భార్యనైన నన్ను దిక్కులేని పక్కికరిణి చేసితివా? నే నేమి నీకపకారంబాచరించితి? డెందంబున నీపదారవింద భజనద క్క వేరేమియు నెఱుంగని చేలనగు నన్నిలీల గాసిబెట్టనీకుమేలె.

సీ॥ కోపమాలేకనా ♦ పాపమానన్ను
సంతాపబెట్టంగనో ♦ దైవరాయ
ఖేదమానీకు ♦ వాదమానాతోడ
ఖేవముగా గూర్పంగ ♦ సాధువంద్య
వాసియానీకిది ♦ దోసమానాయది
యాసునజూడరగ ♦ భాసురాంగ
నేరమానావల్ల ♦ భారమా నేను
విచారముగా గూర్పంగ ♦ సదయహృదయ

తే॥ గీ॥ యింతవంతను గూర్పంగ స్వాంతమందు
దలపుబూనుట గడుమంచిదా తలంప
బ్రోవవేయిపుడైన సంపూర్ణకృపను
పరమ కరుణాస్వభావ గోపాలదేవ॥

అయ్యో యెంతవెట్టిదానను. ఫాలతలమున నిట్టిదుఃఖములుపడుమ ని యీలీల విధాత వ్రాలువ్రాయునద్దితప్పునా. నాథుంగాంచు భాగ్యంబు నాకీజన్మంబున నున్నదో లేదో! కాంతుని గాంచలేకపోతినేని మరణమే శరణము. సాధుసీవరయుటకు ముందీభవనంబునుండి తప్పించుకొనుటెట్లు? నాకెవ్వరు సహాయభూతులగుదురు. (ఇంచుకయూరకుండి) ఈవంతకు నేనే కారణంబు; లేకుండెనేని నాథుండుపురిలోనికి భోజనపదార్థంబుల కొఱకై యేగినప్పుడు నేనేలవెంటనేగకపోతిని (నాథునుద్దేశించి) మనోధవా! యొక్కత్రుటికాలంబైనను నన్నుబాసి యుంటగలుగవుగదా! .

తే॥ గీ॥ గడియమైనను గానినఁ గనకయున్న
మిగుల జింతచే నీమది పొగలుచుండు
నిపుడు ననుఁగూర్చి నీమది నెంతచింత
పడుచునుంటివో కటకటా వత్సరాజ॥

మ॥ ననుబెండ్లాడి సుఖాబ్ధిదేలుదనుచున్ భావంబునందక్కటా
యనుమానింపక యెంచినావుగదఘోరారణ్యమందున్ నినుఁ
ఘనకారుణ్యములేక దైవమిటులఁ గారించు వాడంచు నీ
మనమందెప్డు దలంపవైతివిగదా క్ష్మాపాల చూడామణీ॥

నన్ను వివాహమాడుటకేగదా నీకీ యిక్కట్లు సంభవించె. ధన—(పరివేశించి తనలో) నేటిదినంబున నేమైననుసరే నాకోరిక యీకాంతకు దెలుపక దాళజాల.

తే॥ గీ॥ ప్రాణహానికైనను నోర్తుఁ బరగనిపుడు
కాంతగూడక నించుక కాలమైన
తాళగాజాల నామది తథ్యముగను
నేమిమైననుసరే వేడుదింతినిపుడు

(సుశీలం జేరి ప్రకాశముగా)

చ॥ నిన్నిలఁబుట్టఁజేయుటకు నీరజగర్భున కెన్నినాళులో
యన్నులమిన్న యయ్యెగద యందముజందము చారుశీలసం

పన్నతలయందునీకు సరిభామనుజూడను నిన్నుజూడగా
గన్నులు చాలవామెగద కావలె వేయి కురంగలోచనా॥

మ॥ ఘనురింగన్గొనుచాతకంబుద్యుమణింగాంక్షించుచక్రింబు చం
ద్రునిజూడన్దలచున్ చకోరిఘనసంతోషంబుతో నెప్పుడున్
నినునాపూనన పక్షిగూడ దలచన్ నీచిత్తమెట్లున్నదో
వనితాకోమల పద్మపత్రనయనా బాలేందు బింబాననా॥

తరల

వనితరో యిక జెప్పవాడను భావమందునదాచకన్
మనమునందున నిన్నుఁగూడఁగ మానిసీమణి కోర్కెలున్
జననమయ్యెను మానుతుండును శస్త్రపంక్తుల దేసెని
ఘనముగాగృప జూపుమాయిక గాగలింపుము వేగమే॥

సుశీ — (తనలో) హరి!హరీ! యీనైశ్యుండెంత దారుణ కృత్యంబున కొడిగట్టినాడు. ఈతనిబుద్ధి నెట్లయిన నీతిపధంబునకుందిప్పవలె. (ప్రకాశముగా) సుగుణగరిష్ఠా! వైశ్యకుల శ్రేష్ఠా!

తే॥ గీ॥ అన్యపరకాంతరతి పాపమన్నవన్నుఁ
గూడుదలపును నీకుది పీడమన్నఁ
జేర్పనీసతియందున జిత్తమున్న
పుణ్యజనులు పోవు తెరువు పోవుమన్న

ధన— కవిరాజవిరాజితము.

ఇదివరకీ ధరణీతలమందుననిందు నిభాస్యల నొందజినో
ముదమునఁగాంచితి నీకునమానుల మోహాంగింగాంచగలేదచటన్
మదనుని బారికిజిక్కితినిప్పుడు మానిని నిన్నిటు గాంచగనే
యధరసుధారసమిచ్చికనందగునబ్జదళాక్షి రోపూర్ణాకృపన్॥

ఉ॥ నీదువయోవిలాసమును నీరజవైరినిబోలుమోమునున్
నీదు విశాలనేత్రములు నీకదు దీర్ఘశిరోజపంక్తియున్
నీదు శరీరమార్దవము నీదుకుచద్వయి సుందరత్వమున్
మోదముతోడఁగాంచితిని మోహముతొడితినన్నుబ్రోవునీకా

స:— (తనలో) హా దైవమా! ఘోరకాననంబులం దైనను కందమూలఫలంబులాహారంబుగా భుజించుచు గాలంబుగడపనీయక నన్ను నామనోహరున కెడబాపి తుదకీ వైశ్యాధమునిచేతిలో జిక్కజేసితివా? (ఇంచుకయూరకుండి వైశ్యునుద్దేశించి ప్రకాశముగా) అన్నా! నిజమనోధవసేవవిడనాడజేసి వంచించి నన్ను గొనితెచ్చినావు. ఇదియెంతయునీకుబాపము. నీకునిట్టితలంపులు మదినిబూనకనాయందు సోదరీభావమవలంబించి కరుణతో నాభర్త యెక్కడనుండునో వార్తబంపి నన్నాయనకడకుబంపుము. నీకు గడుపుణ్యంబు సంభవించును. అంతేకాని పతివ్రతలనెప్పుడును శీలభంగము జేయుకోరిక చిత్తంబునబూనకుము. పరాంగనారతిమానసులకు ముక్తిదూరంబగును. నావాక్యంబులు వేదవాక్యంబులుగామదిందలపోసినన్ను నా భర్తకడకుబంపయత్నింపుము.

ధన— (తనలో) ఈమెపైకిట్లుచెప్పుచున్నను చిత్తంబునమాత్రము నాయందుకరుణలేకపోలేదు ఎందులకోయించుకకాలహరణంబు జేయుచున్నది. (ప్రకాశముగా)

మ॥ అకటా వీడినసీదు భర్తకొరకీయాలాపమింకేలయో
చకితాక్షీమణి చింతలెల్ల నొగిన్ స్వాంతంబునన్ వీడియా
సుకుమారున్ ధనపాలగుప్తవణిజున్ శోభిల్లగాగూడుమ
త్యకలంకంబగు సౌఖ్యమందెదవు సత్యానంద వైసుందరీ॥

అబలా! యడవులంగడు కౌడిదంపుటిడుములబడుచు నాధనహీనుండగు భర్తతో నేమిసుఖంబులందెదవు?

తే॥ గీ॥ అప్పుడే యెండనువైచిన యట్టిలేత
తామరాకుపగిది వాడితసర నేల
చింతలన్ వీడిమల్లెపూబంతి బగిది
నన్నుగూడి యుండంగరాదె వన్నెలాడి॥

తే॥ గీ॥ రమ్ము నాతోడగలియగా రమణిమున్ను
హర్మ్యములను వివిధభూషణాంబరములు

